శ్రీ ... స్థాన పాశీ దివాన్ బక్షీ మహాపాత్రులుంగారు, మాణిక్యదాస వాహన.

శ్రీ వరదా కామేశ్వరరావు నాయుడుగారు

శ్రీ శ్రీ శ్రీ మహారాణీ సాహెబావారు, తునిసంస్థానము

శ్రీ శ్రీ శ్రీ రాణీ కాకర్లపూడి అప్పలనరసాయమ్మ అయ్యగారు
రామచంద్రపురం

శ్రీమతి వాఘిరెడ్డి పద్మనాభమ్మగారు, పిఠాపురం

## పోషకులు.

శ్రీమతి గాదె మాణిక్యదుర్గమ్మ గారు
" గజవిల్లి సుభద్రమ్మ గారు
" దిగుమర్తి రాజ్యలక్ష్మమ్మ గారు
" ఉన్నవ మహాలక్ష్మమ్మ గారు
" పేర్ల అన్నపూర్ణమ్మ గారు
" దుగ్గిరాల రమణమ్మ గారు
" కొమ్మూరు లక్ష్మీనరసమ్మ గారు
" వేమూల చంద్రమతమ్మ గారు
" చతుర్వేదుల సుబ్బమాంబ గారు
" వైశ్యరాజు సూరయ్యరాజు గారు
" అక్కనూరి బుచ్చయ్య శ్రేష్ఠి గారు
" ఆయుర్వేద డి. శ్యామసుందరరావు బ్రదర్సు గారు.
" చెంగాళం మృత్యుంజయ నాయుడు గారు
" బల్లికి నారాయణ నాయుడు గారు
మ॥రా॥రా॥ వలపల కామోజీ నాయుడు గారు

" అప్పికట్ల సుంబనాథం పంతులుగారు

" నల్ల శివయ్యగారు

# సహాయులు.

శ్రీమతి వరహాగిరి వెంకటసుబ్బమ్మగారు

" మాలెల్ల సుబ్బలక్ష్మమ్మగారు

" వాకం రామలింగయ్యగారు

" తాడిమేటి శేషగిరమ్మగారు

" కంభాన సీతాయమ్మగారు

" ఊన్నవ వెంకట సత్యనారాయణమ్మగారు

" కొల్లూరు సోదెమ్మగారు

" పులిపాకం వెంకటరమణమ్మగారు

" కాకలి వెంకటరత్నమ్మగారు

మ॥రా॥రా॥ మల్లెల గంగయ్యగారు

" పోచిరాజు రాజేశ్వరరావుగారు

" శ్రీసుగంగమ్మరు చాతానారోడు మద్రాసు, మోత్తేపు

" నూతి రామమూర్తిగారు

" కొండాడ వ్యాసిసుబుద్ధిగారు

" శ్రీరాజా విక్రమదేవ వర్మగారు.

" పరిఖల లక్ష్మీనృసింహం పంతులుగారు.

" కళ్ళేపల్లి రాజేశ్వర రావుగారు.

" మరుకట్ల శివరామయ్య భక్తగారు.

" ధవళ సూర్యనారాయణ నాయుడుగారు.

" కళ్ళేపల్లి మజ్జవరామమూర్తిగారు.

" తాటికొండ లక్ష్మీనారాయణగారు.

" కోటిని కృష్ణమూర్తి శ్రేష్ఠిగారు



# శ్రీమతి కళ్లేపల్లె వెంకట రమణమ్మ

పత్రికాధిపురాలు.

## విషయసూచిక.

# ఆంధ్రసోదరీసమాజము, హైదరాబాదు.

ఈసమాజపు ప్రథమ వార్షికవృత్తాంతపత్రికను కృతజ్ఞతా పూర్వకముగా నందుకుంటిమి. ఇయ్యది 1922 సం॥ రం॥ సెప్టంబరు తే 3 దీని స్థాపింపఁబడినది, ఈసమాధ్యక్షురాలగు శ్రీమతి పండిటవీర రాఘవమ్మగారును, కార్యదర్శినియగు శ్రీమతి అకణి సావిత్రమ్మగారును సహాయకార్యదర్శినులగు శ్రీమతి చూడామణమ్మగారును, నడింపల్లి సుందరమ్మగారును చేసిన పరిశ్రమ ప్రశంసనార్హము. సమాజము 16 గురు సభ్యురాండ్రతో నారంభింపఁబడి సంవత్సరాంతమగుసరికి 20 మం అయిరి.

సుప్రసిద్ధ వైద్యశిరోమణులగు డాక్టరుమల్లన్నగారిధర్మపత్నియు, నాంగ్లేయ మహారాష్ట్ర భాషలయం దపార పాండిత్యముగల విదుషీమణియగు శ్రీమతి అహల్యాభాయిగారి ఆధిపత్యమున నీప్రథమవార్షికోత్సవమతి వైభవముతో జరుపఁబడినది. మేమాయుత్సవమున కాహ్వానింపఁబడియుఁ గార్యభారమున నేగఁజాలకపోయినందులకు కించనొందుచు క్షమింప నా సమాజకురాండ్రను ప్రార్థించుచున్నాము.

ఈ సమాజాంగముగ నొక పాఠశాల నలుగురువిద్యార్థినులతో స్థాపింపఁబడినందులకెంతయు సంతసించెదము. సదుద్యములకనేకవిఘ్నములు సంభవించుట స్వాభావికము. అటులనే ఈయుద్యమమునగూడ నుదారస్వభావయు, స్త్రీవిద్యాభిమాననీయయు శ్రీయుత సేటులాల్జీ మెగ్జిగారి ధర్మపత్నియునగు శ్రీమతి హీరాభాయిగారియొక్కయు, సమాజమునకు మణియై విలసిల్లుచుండిన శ్రీమతిచూడామణమ్మగారియొక్కయు నకాలమరణముల పారనష్టము కలిగించినవి. అందులకు మాయనుతాపమును, [illegible]ణిని తెలుపుచున్నారము.

పత్రికాధిపురాలు.

# బాలనీతికథ

---

మనము సంఘజీవులము. అనఁగా ననేకుల మొకచోఁగలి గాపురముండువారము. అందుచే నొకరిసాహాయ్య మొకరపే క్షించుచు పరస్పర స్నేహముతో నుండ వలసిన వారమగుటచే నొక్కొక సంఘముగాఁ గూడి యొక్కొక దేశమున నివసించు చున్నాము. ఇటుల పరస్పర స్నేహముగలవారు మిత్రులనఁబడు చున్నారు. ఈ మైత్రి లోకములో నిపుడు కార్య సాధన కొరకే చేయఁబడుచున్నది గాని నిజమైన మైత్రిగా నెంచబడుటలేదు నిజమగు మిత్రుఁడు లభించుట దుర్లభము. అట్టి మిత్రుడు తన ప్రాణమును కూడ తృణమువలె నెంచి స్నేహితుని కొరకు పాటు పడును. జటాయువనుఖగము రాముని భార్యయగు సీతకై రావ ణునితో యుద్ధముచేసి తన ప్రాణములనుగోలుపోయెను కర్ణుఁడు దుర్యోధనునకై పాండవులతో కలహించి మరణించెను. సుగ్రీ వుఁడు రామరావణ యుద్ధములోను శ్రీకృష్ణుఁడు కురు పాండవ యు ద్ధములోను మిగులగాసిల్లి కార్యములను సాధించిరి. అట్టిస్నేహి తు లెంతయో పుణ్యము చేసికొనిన వారికిగాని సామాన్యులకు దొరకరు. సాధారణముగ మనకొరకుస్నేహితులు తమకార్య ములను సాధించుకొనుటకై చూచెదరుగాని. మన కార్యములకు సాహాయ్యమొనరింప వెనుదీతురు. ఇందు కుదాహరముగ నొక కథఁ జెప్పెద నాలింపుడు.

పూర్వకాలమున నొకానొక వనమున నొక చెవులపిల్లి

వాసముచేయు చుండెను. అది మిగుల కుశాగ్రబుద్ధి, దయగల
చిన్న సాధుజంతు వగుటచే నావనమునఁ గాపురముండు తక్కిన
సాధు జంతువుల కాపద సంభవించు కాలమును ముందుగా
గ్రహించి వానివానికిఁ దెలుపుచుండును. అందుచే తక్కిన జం
తువులన్నియు నీ కుందేలుతో మైత్రిగలిగి వర్తింపుచునుండి దా
ని కేవిధమగు నాపద సంభవించినఁ దమతోఁ జెప్పిన యెడలఁ
దప్పక కాపాడెదమని బాసయిచ్చినవి.

ఇట్లుండ నొకానొక దినమ్మునఁ గొందరు వేటగాండ్లు ఆవన
మునఁ బ్రవేశించి కుందేళ్లను వేటాడుటకై తమకుక్కల నుసికొ
ల్పిరి. ఇట్లు యాపత్కాలంబున తన స్నేహితులు తనను సాహా
య్యముచే నెదరను నమ్మకముతో కుందేలు మొట్టమొదట
నొక గుఱ్ఱము కడకేగి తనకు రాఁబోవు నాపద నెరిగించి తనను
దానివీపుమీద నెక్కించుకొని ఆక్రూరశునకములకు దూరముగా
తోడ్కొనిపోయి తన ప్రాణ రక్షణము గావింపుమని మిగుల
వినయముతో వేడుకొనెను. అందుల కాగుఱ్ఱము తాను వెంట
నే తనయజమాని పనికేగవలసి యుండుటచే తీరుబడి లేదనియు,
వేరొక మిత్రుని ప్రార్థింపుమని యు నయ్యది తప్పక తోడ్పడు
ననియు జెప్పి తప్పించుకొనెను. వెంటనే కుందేలొక యావు కడ
కేగి తన మాటలనే ప్రార్థించెను. అదియు నప్పుడే తన యజమాని
తన పాలు పిదుకు వేళ కావచ్చినది గాన తీరుబడిలేదనియు వేరొక
జంతువును కోరిన తప్పక సాహాయ్యమొనరించుననియు చెప్పి తప్పిం

చుకొనెను. తరువాత కుందేలొక మేకయొద్దకేగి అటులనే ప్రార్థించెను. అదియు కుక్కలు కుందేళ్లను వలె పొట్టేళ్లను కూడ వేటాడునుగాన దానితో పాటు తానును చావవలసివచ్చునని సాకు చెప్పి తప్పించుకొనెను. ఇటుల కుందేలు తన స్నేహితుల సందరిని వేడుకొనెను. అందరును నేదియో సాకు చెప్పి తప్పించుకొనిరి. అంతట కుందేలు విసిగివేసరి తనలో తనకెందరో స్నేహితులు గలరని గర్వించుచుంటినియు, తుదకొక్క స్నేహితుడైన లేకపోయెననియు పరులను నమ్ముకొని మోసపోవుటకన్న స్వయంసహాయమే సర్వోత్తమమైనదని గ్రహించి తుప్పల సందులనుండి రెండవ కంట పడకుండ పరుగెత్తి పారిపోయి నిరపాయమగు నొక ప్రదేశమునకేగి ప్రాణములఁగా పాడుకొనెను

——(o)—(o)—(o)——

పొల్లులగునా.— వేజవుక్లారెన్సు అనునతడు 18 అంగుళముల పొడవును 17 పౌనులు బరువు నుండెనట సాధారణముగా అతనిని చొక్కా జేబులో వేసుకొని పోవచ్చునట. మనిషివలెను బొమ్మవలెనుయుండు యీవిచిత్రస్వరూపమునుకన్న తల్లి తండ్రులెవరో తెలియలేదు. ఆహా! వెంపలిచెట్టు నెక్కుటకు నిచ్చెన నుపయోగించుమానవులిక ముందు జనింతురనిన మన పూర్వుల వాక్యములు పొల్లులగునా? [నవ్వులతోట]

———

శ్రీ శారదాంబాయనమః

# ఆశీర్వచనము.

(శ్రీయుత వఝ్ఝుల వేంకటేశ్వరులు గారు)

శా॥ శ్రీలాలిత్యపదార్థగుంభనల స • చ్ఛృంగారమాధుర్య వి
ద్యాలీలానిపుణత్వపండిత కవీ • ద్రాళిప్రభాయుక్తమై
బాలా నీతి హిత ప్రబోధన కళా • ప్రారంభ సంరంభమై
శ్రీలక్ష్మీప్రయుతాంధ్రలక్ష్మి విభవ • శ్రీబొల్లుప్రశాంతమున్

శా॥ శీలత్వాదిగుణప్రధానపతి సం • సేవానయాసక్త న
ద్యాలారత్నసమాదృతిప్రకటనా • భావానుకూలప్రభా
లీలన్ సాదరణీయమై సుగుణ వ • ల్లీభూషణాగారమై
శ్రీలక్ష్మీప్రయుతాంధ్రలక్ష్మి విభవ • శ్రీబొల్లునప్రశాంతమున్

శా॥ బాలానీకనిరంతరప్రణుతమై • పద్మంబునన్లక్ష్మియుం
బోలెన్ శ్రీకమలాసతీవిభవ సం • పూర్ణాంధ్రదేశంబునన్
శ్రీలక్ష్మీనతినాగధీరనుత కీ • ర్తిస్ఫూర్తిశోభిల్లు నా
శ్రీలక్ష్మీప్రయుతాంధ్రలక్ష్మి విభవ • శ్రీబొల్లునప్రశాంతమున్

శా॥ ఏలక్ష్మీసముపస్థితోత్తమము ధీ • రేంద్రప్రశోభాంధ్రదే
శాలంకారము; మొద్దియాంధ్రవర వి • ద్యాప్రతిశానంతతి
మ్మాప్లింపఁదగు; నెద్దిలోకమున న • మ్యకీర్తి రాజిల్లు; నా
శ్రీలక్ష్మీప్రయుతాంధ్రలక్ష్మి విభవ • శ్రీబొల్లునప్రశాంతమున్

శా॥ పాతివ్రత్యమహత్వభర్తృహితసే • వాధర్మసన్మార్గవి
ఖ్యాతన్యాయనువర్తనా సతత స • త్యత్యాగశీలాది స
న్నీతుల్శోభిల నాతిమిన్నలకు సం • తేజేయు శ్రీమన్మహి
తతఖ్యాతియుతాంధ్రలక్ష్మి వెలయున్ • ధీరాంధ్రదేశంబునన్

శా॥ హిందూరాజ్యసమస్తవిప్ర విపులా • ధీ శార్యశూద్రప్రజా
బృందాగారకలాపసంతతనట • చ్ఛ్రీభామినీరత్న సా
మందానందకటాక్షదృక్పతనసం • ప్రాప్తాఖిలాశాంతసం
స్ప దోర్కీర్తిసుతాంధ్రలక్ష్మిజయసం • పత్తిన్వెలుంగుంధరన్

ఉ॥ తారకలందుచందురు వి • తంబునసంతత మాంధ్రలక్ష్మి తా
భారతరాజ్యలక్ష్మియయి • విస్తృతులంగొని భూరివైభవ
శ్రీగమణీయమైనుగుణ • సేవితమై లలనోపయోగమై
తీరవరేణ్యపూజ్యయయి • తేజరిలుంధరణీతలంబునన్

కం॥ శ్రీమజ్జన సంశోభ్యము
భామలకున్మేలుబంతి • బహుసద్గుణబో
ధామేధానైపుణ్యము
శ్రీమంతంబాంధ్రలక్ష్మి • చెన్నలరారున్

సీ॥ పటుతరబుద్ధిశుద్ధి వరి • పాకలసద్బుధవక్త్రనిర్గత
స్ఫుటనయవాగ్విలాసగతి • భూమణనం విదితాంధ్రలక్ష్మిచె
న్నొటికి ధరాతలంబున న • పారయశంబున వెల్గు నల్ల పే
శటరమణమ్మకీర్తిప్రతిజ్ఞ • గంబులనాటుకొనందిరంబుగన్

మ॥ ధనమత్యంతముగల్గుచో నతిథిస • త్కారక్రియా పుణ్యసా
ధనమో, పండితగేయనర్తనమొ, కాం • తాలోకనస్వర్గభో
ధనమో, యింకిదియేని జేయుటయ యుక్తంబంచు నెంతేని యు
త్సవముం జెంచివ్యయించుచున్నరమణ • మ్మన్ బ్రోచు దైవంబిలన్

కం॥ సంకేతవాగర్భాండా
లంకారశ్రీమదాంధ్ర • లక్ష్మీశ్వశ్రీ
సంకాశసతీవందిత
వేంకటరమణమ్మ నెలయు • విశ్రుతకీర్తిన్

కం॥ రమణీరత్నంబులకున్
సమబుద్ధిన్ సకలనీతి * సరణుల్ దెల్పన్
సమకట్టిన శ్రీవేంకట
రమణమ్మ యశంబు దిశల * రాజిలుగాతన్

ఉ॥ శర్వనమానులార ! విలసద్గుణవార్ధి శశాంకులార యో
సర్వజనంబులార ! కవిసత్తములార ! మహాత్ములార ! యా
శీర్వచనంబునాఁగ నిదె చెప్పిన పద్యము లాంధ్రలక్ష్మికిన్
సర్వజన ప్రమోదకర సంగతి నిచ్చుత మేలు గోరుచున్



శ్రీ రామార్పై నమః

# శ్రీ రఘువంశభూషణ శతకము

ఉ॥ శ్రీ వసుధాకుమారి తన * చీరచెఱంగున స్వేదమార్పఁగా
వీవ ధనుఃకృపాణముల ర * వింబలె లక్ష్మణమూర్తి దాల్చి మా
న్నావిపినాంతరోటజము * నందు సిపాయిగ నిల్వ జేసితిన్
బూవులపాన్పుపై నిదురఁ * బోతిగదా రఘువంశభూషణా

ఉ॥ కాలము వెళ్ళఁబుచ్చితి సు * ఖంబుగ నీదయగల్గ నీపయిం
బాలనుముంచ నెంచితివొ * వారినిముంచెదవో యెఱుంగఁ గాఁ
జాలనరుండనాటఁ గలు * షంబులుగల్గక మానవందునం
దాలిమిదూలిదొల్లి దయఁ * గప్పుడుమీ రఘువంశభూషణా

ఉ॥ మాఱనికూర్మిరక్కసి నఁగ * మాతృలనీభవ పంకిలంబునం
శేరిచి యావనాత్రయు వి * శిష్టపరిశ్రమ ముంచిమాటుటన్
సైరణమాలినట్టి కిటి * చాడ్పున నొక్క నిమేషమేనియుం
దీరికలేదు నిన్ను విను * తించుటకున్ రఘువంశభూషణా

ఉ॥ శ్రీ వనితాశిరోమణి గ * రిత్రిని నీలసమానబుద్ధిచే
వారిరేక యేలితివి * భక్తకుటుంబము నుద్ధరింపఁగాఁ
గావఁగదయ్య భక్తనిఁగఁ * గైకొనినన్ను సుకష్టనేరముల్
నావలనంగ నంబడిన * నల్పకుమీ రఘువంశభూషణా

చం॥ తలకక సజ్జనంబులకు * బాసుకోదర పోషణార్థమై
సలిపిన కామ్యకర్మముల * సంగతిలోఁ బడియున్న వాడు మా
యలు సుళువైనవక్కవిన * యంబులుచాటునఁ గాంచి మోహపల్
వలువురిలోనఁ జేసితను * నవ్వకుమీ రఘువంశభూషణా

ఉ॥ నీతెనిఁ జెప్పవచ్చుఁ దన * నేర్పుకొలందిని లాతివారికా
రీతిని నీభవంబునఁ జ * రించుటకష్టము మార్గలోక సం
ప్రీతినిమిత్తమై నివసు * వేషము కైతవభావమూని ప్ర
ఖ్యాతిని గాంచఁబని * గాదనుమీ రఘువంశభూషణా

చ॥ పరమకృపా(ప్ర)దీప్తి నరి * వర్గము నింద్రియపంచకోద్ధతిన్
దరిమినమాను లెల్ల వని * తా కనకాదులపట్ల దాను లై
తిరిగిరి జన్మకున్ సహజ * దీధితి నేనొక లెక్కగాను; నన్
దురితుని గాఁదలంచకొని * దూరము మీ రఘువంశభూషణా

చ॥ చదువు గురించి వాగురువు * సల్పినబోధన శైశవంబున
న్మదినిఁగరంచలేదిపుడు * జ్ఞప్తికివచ్చి సుధానిదానమై
చెదరగఁజేయుచున్న యది * చేతులు గాలిన వెన్క యాకుల
న్వెదకినఛంగి నేననిన * వింతగదా రఘువంశభూషణా

చ॥ స్మరశరవహ్ని వావి వరు * సల్ గణియింపక యౌవనంబునన్
దరుణుల పాలికాపురనయి * దాయము కాయము ధారవోసి ని
గ్గరితినిఁ దుచ్ఛభోగములఁ * గాంక్షజనించిన శైహికంబునన్
బరము నేఁగల్గునాసుఖము * భ్రష్టుఁడనో! రఘువంశభూషణా

ఉ॥ దేహము గాలిలోనిడిన * దీపము; పుట్టుక నీటిబుగ్గ; సం
దేహము చిత్తవృత్తియని * నేను నెఱింగియు నీదు మాయచే
మోహమెసర్చి జ్ఞానబల * ముం గృశియింపఁగఁ జేయుచుండెఁ ద
ద్దోహదమైనభక్తి * దయతో నిడుమా రఘువంశభూషణా

ఉ॥ కన్నులపండువయ్యెఁ గలఁ * గాంచుట వేసవవేళఁ దావకీ
యోన్నతనీలదేహము స * ముజ్జ్వలరూపము, చారు నేత్రము
మన్ననజేసి వారెదుట * మాటలనాడి వరంబొసంగు సం
పన్నత నాకు నెన్నటికిఁ * బట్టునొకో రఘువంశభూషణా

ఉ॥ భూసురునైకమత్యము, (ప్ర * భు)పతిశౌపటిమంబు వైశ్యు వి
శ్వాసము, శూద్రజాతి మృదు * సత్యసుభాషితముల్ ప్రపంచకా
వాసములై భక్తిరస * బద్ధులు గాని లోపమొక్కటిం
జేసితి వెంతమం జతుర * శేముషివే రఘువంశభూషణా

# స ర ళ :

—(o)—(o)—(o)—

( వెనుకటి తరువాయి )

ఇందుమతి:— కోడలా! వైవాహిక సంబంధ మాజన్మాంతము దృఢతర బంధంబుగదా ! అట్టియెడ బాల బాలికల చిత్తవృత్తి, నరసి అనుకూలురకొనంగిన సౌఖ్యంబలవడునా ? లేక మనమనో వృత్తినుసరించిన అనుకూలమా!

రజని:— అత్తా ! ఇదియా మీప్రశ్నార్థము ? ఎచ్చటనైన నెద్దు నడిగి గంతకట్టుదురా? పసికందువులు వారికేమి తెలియును? వారి గుణాతిశయంబులును, ధనాది భాగ్యంబులును, గుర్తించి జననీ జనకులే తమమనమున కెక్కువాని కొనంగ వలెను. గాని బాలల కేమి తెలియును?

ఇందు:— అట్లయిన నీవిషయము వారల కెరిగించుటగూడ నన వసరమేకదా! జంత్రపుబొమ్మలపగది కొనిపోయి బంధించుటయే శ్రేయస్కరము. అంతియేనా నీయభిప్రాయము?

రజని:— అత్తా ! "పిల్లకాకేమిరెుకుగు గుండుదెబ్బ" అనురీతి అజ్ఞానావృతలగు బాలల కేమి తెలియు నందలి లాభ నష్టములు మాతశిచెంత నొక మోదుగపుష్పంబును ఒకసంపంగిపుష్పమును నిడుడు. వాండేమిగైకొనును. అటులనే యావిషయమునంగూడ జరుగును.

ఇందు:— అట్లనకుము రజనీ ! శైశవావస్థ గడచిన పదినంవత్సా

ముల కొలుఁడేమిగైకొనును. చంపకమునే గదా ! అట్లే పదిపం
డెండేండ్ల బాలిక లజ్ఞానావృతలైన గావచ్చును గాని మన సరళా
నళినీ మొదలగువా రెట్టియజ్ఞానులు ? కష్ట సుఖముల గుర్తించు
జ్ఞానము వారల కలవడినది. అట్టియెడ వారిసౌఖ్యాదిమూలమగు
వైవాహికమున వారి యిష్టానుసారమె జరిగించవలెను గాని మన
మనోవృత్తిననుసరించి చేయుగూడదు.

రజని:— అత్తా ! మీరు కోపగించుకొనకుము. మనజననీజనకులు
మనలనడిగియే వివాహంబులు గావించిరా? మన కులాచారానర్థ
దాయకములగు మాటలేలఁబల్కెదరు? ఆ పాడు బ్రహ్మసమాజ
ములో రజస్వలా నంతర వివాహ మొనర్చెద నని ప్రమాణము
చేయుటచేగాని లేనియెడల సరళ నీతకాల మాపుదుమా? మన
పూర్వీకు లెవరైన పండ్రెండు సంవత్సరముల వరకైనా బాలికల
నవివాహితలుగ నుంచనిచ్చిరా? వారేమి యంతబుద్ధిహీనులా?

ఇందు:— రజనీ ! ఎప్పుడో మన యాది పురుషులు కొట్టుకొన్న
అన్నము ను తిను చుండెడి వారలని మనమీ పరిని నిరాకరించి
పూర్వాచరణ మొనరించు చున్నామా? వారు మోటు వస్త్ర
ములు ధరించెడివారు. మన మీ సన్న డుకూలముల నేల గట్టి
వలయును. కాలమునుపట్టి పరిస్థితులు మారును. ఆకాలంబున
దుష్ట తురుష్క పరిపాలనమున గలిగెడి యాపదల కడలి అవి
వాహితల చెరగొనిరను నుద్దేశముతో నట్లొనర్చు చుండిరిగాని
బుద్ధిహీనతచేగాదు. బుద్ధి యాధిక్యతచేగాదు: కాలాధీనులై ప్రి

వర్తించిరి. 'ఏమొండ కాగొండుగు' అను నార్యోక్తి రిత్తయా?
రజని:—అత్తా! సాక్షాత్తు కుంధతీసమానలు. మీతో నేనెట్లు
వాదించగలను?
పార్వతి:—ఇంతియేనా రజనీ! ఇందుమతీ దేవిగారి పక్షము కోకి
పోతిక; అని చప్పట్లు కొట్టెను. తక్కుంగలవారెల్ల నామె నను
సరించి గొల్లున నవ్వుచుండిరి. ఇందుమతి మాత్రము వారలనను
సరింపక శమ దమాది సద్గుణ తనములు మోమున చెలువంద
కించిత్ క్రోధస్వరంబున పార్వతీ! ఏమి యీ చిన్నతనపు చేష్టలు
ఎంత వయసు గడచినను, మొదట బిడ్డల తల్లులైనను యీ యా
గడపు చర్యల కంతము లెదా? నవ్వు నాలుగువిధముల నష్టమను
సంగతి నెఱుంగరా? అనిన తోడనే వర్షపాతము వెలసిన రీతి
నెల్లరు నిశ్శబ్దము నాశ్రయించిరి.
ఇందు.—మీరన వ్వొందరి హృదయంబుల ననుమాన బీజముల
నాటి వారివారి యందుండు లోపముల తలంచి యాగ్రహము
లను చెయుచు ఆలోచింపుడు. అవమానము నాశ్రయించినయే
గదా క్రోధముండును. అట్టి క్రోధమువలన వైరము సంప్రాప్త
మగును. ఇక చెప్పవలసిన దేమి పరస్పరముభావలోకనంబులు
నశించును. ఇట్టినవ్వును మీయట్టి యుచితానుచిత జ్ఞానముగల
విద్యావతు లాశ్రయింపవచ్చునా? లక్ష్మణ దేవరనవ్వు అని యొక
పాట కల్పించి నవ్వువలన గలుగు దోసగులు మన పూర్వులు
తెలియబరచినారు గాని నిజముగా లక్ష్మణుడు నవ్వనని కాదు;

పార్వతి:— అమ్మా! నేరక నవ్వితిమి క్షమింపుము.

ఇందు:— ఇప్పటి మాట చెప్పలేదే పార్వతీ! ఎప్పటి కైనను ప్రమాదమని చెప్పితిని. ఒకవేళ నెక్కువ వినోదకార్యమేదయిన సంభవించినను మందహాసము చేయవలెనుగాని కెవ్వున దంతము లను వెలిబరుపరాదు. మీ మేలుకొరకే చెప్పితినిగాని నా కేమియు కోపములేదు. క్షమించుట కిందేమిగలదు? నా బిడ్డల భంగి భావించిచెప్పితిని. గత జలసేతుబంధనమున లాభమేమి? ముందు మంచికై చెప్పితిని. మీ అత్తగారు మొదలగు వృద్ధుల యెదుట నొక్కసారి నవ్వుడు. ఎన్ని దూషణవాక్యంబులు వెలువడునో యెన్ని తగాయిబాలువచ్చునో! సాధారణముగ మన్న లోనున్న దెబ్బలాటల కిదియేకదా కారణము

కాంత:— పిన్నీ! నీవెంత కెవుడుచేరినను ఇట్టిహితమే బోధించుచుందువు. నీయట్టి సతీతిలకమునకై యా విధ్యానాథులున్ను నయిత్రికై నళినీ మోహనులును, తొలి జన్మయందెంతటి పుణ్యమొనర్చిరో కదా!

ఇందు:— కాంతా! స్త్రీల నైజగుణములగు నావాక్యములు లపొగడెదవు? ఎల్లర కిట్టి లోకజ్ఞానముండుగాని మనోదార్ఢ్యముచే జ్ఞానము నవలకుదొలచి చలచిత్తమున కాశ్రయులగుదురు. రజనీ! ఆవరునకు వయసెంత? సంతానమెంత? ఎల్లరు మునే ప్రేమింతురని తలంచితివా!

...:— సిరిరా మోకాలొడ్డువారు కలరా! మహారాణి న్ని

బోలె హాయిగ జీవనమాత్రే గడుపుమన దుఃఖించువారు గలరా!
"సర్వేజనాః కాంచన మాశ్రయంతి" అను నార్యోక్తి నిత్యమే!
వయ సెంతయో లేదు. నలుబది వత్సరములు దాటినవేమో. సం
తానమైన నెంతే. నలుగురు మొగపిల్లలు మాత్రమే.
ఇందు.— ఇంకేమి? రజనీ! ఈ సంతానము నీవయసు నెరు
కావా? ఇట్టి గత వయస్కునకా యీ నవళా మణి నొసగుట.
మీకేమి మతిలేదా? దాని యిష్టా నిష్టములనైన నరసితిరా?
సంతాన మెంతయుంటివి. ఈ నలుగురు చాలరా?
రజని:— వారలిమెనేమి బాధింతురు. ఎవరి కర్మమున వారు
దుసుగారి ఆడుపిల్లలవలె పురుషు పుణ్యము మొదలగు కార్యము
లకు బాధింపరుగదా?
ఇందు:— ఆహా! ఏమియీమూర్ఖత ఆడుపిల్లలు వత్సరంబున
రెండు నాదల రూప్యంబులతో విసుతురు. మగపిల్ల లాజన్మా
భాగస్థులు ఎవరిఋణమునకు వారు సరిచూచుకొని నంతసించి
జాలునా? వరులు హర్షించవలదా? ఈ అనను కూల దాంప
మువలన సుఖ మలవడునా? సరళ సమ్మతించెనా? ఆమెకీవి
యములం దెలిపితిరా?
రజని:— దానివిపిలిచి చెప్పలేదుగాని మే మనుకొను మాట
వినుచునేయున్నది. మౌనభావము వహించినది. మౌన మర్థ
గీ కారముకదా!
ఇందు:— అదుగనిదే యేలచెప్పను? అయిన నీదాంపత్య మ

కూలదాయకముగ నుండునని నాకు తోచుటలేదు.

రజని:— అత్తా! నళినీదేవి నర్పించుట కా ప్రభాకరుని మనుజా కృతిఁ గ్రొత్తకాసఁ బ్రార్థించి అర్పింప మీకునమస్థలుగ నుంటిఁగాని మా మట్టి కుల్యాలు కది యెల్లు సాధ్య మగును. అంతలో నొక శకటము మా ప్రాంగణంబు చెంత నాగెను. దానిని గాంచి వనితామణు లెల్లరు రజనీదేవిని వీడ్కొని వెడలిపోయిరి.

---

## శిష్యుడు.

(శ్రీయుత బుఱ్ఱా శ్రీరామకవిగారు)

సీ॥ సత్యమును శాంతమును ధైర్య * సాహసములు
నోర్మి యనుపమ వినయంబు * నుత్సవాంబు
మున్నగాగలగుణముల * మొదటివాడు
దనఁ బనొకచోట భూముగ * తనయుఁడొకడు
గీ॥ అతఁడొకనాడు మొక గ్రామ * మరుగుచుండె
నట్టినడి [illegible]వలోను ప * న్యాసి యొకఁడు
గలసి యిట్లను చేరెమి * గ్రామమేది?
యెచ్చటికి నేమికతమున * నేగెదీవు?
సీ॥ అనిన నాతని కిట్లను * నవనిసురుఁడు
భావకొండను వెరిట * బరగువాఁడ
పల్లవరమను చిన్నగ్రా * మంబు మాది
నరుగుచున్నాఁడ విద్యల * నభ్యసింప
బ్రాహ్మవేదాంతి యగునొక్క * గురుని కొఱకు

గీ॥ యనిన వశ్వాలుపల్కులు * వినియతండు
గనికరించి యతనితోని * ట్టనియె నృప!
విశుమ యొకమంత్రమును చెప్పె * దను యొకింత
శ్రద్ధమైబాని నొకతూరి * జపము సేయ
ముక్తి శివుడిచ్చు దన్మంత్ర * శక్తి వలన

సీ॥ అనుచు నొకమంత్రమును చెప్పి * యతడుపోవ
శిష్యుడద్దాని నిత్యంబు * సేయఁ జపము
వాని జపమునకును మెచ్చి * పార్వతీశు
డతికృపాశాలి వాడె ప్ర * త్యక్షమగుచు

కం॥ కరముమరుఁ గనిట్లని నే
వరదుడ గాదవో యడుగుము * త్వరనీకిత్తున్
వరమశ్కృకైలేనియుడన్
సరసతిఁ గైలాసమునకుఁ * జయ్యనరమ్మా!

కం॥ అనుచు విమానము లాపిన
వినయముతో నిట్టులనిరె * విప్రుడు గమాగు
ర్వ్యమకూడ బిల్చి తెచ్చెద
గన ఎలనింబోలుఘనుడు * గలడే ధరలోన్

కం॥ ఇలసురుడిటు బల్కిన ప
ల్కుల విని వారుడిట్టులనిరె * కురాపి! నీమా
టలు వాకచోద్యమాయెను
యిలలో నీగురుని వంటి హీనుడు గలడే

కం॥ ఏమనియెదవా యొరుకల
భామను పెండ్లాడినాడు * భ్రష్టుడయ్యెన్
నీమములవిడచినా డతి
కాముకుడగుచు దోస * కారియనగు చున్

గీ॥ అట్టి నీగురున్వా నెట్టుల * ననుమతింతు ?
కాదు కైలాసమునకు దా * నవుడు దాగ
నిష్టమై లేని నీవువా * విష్ణువునకు
రమ్ము ! గురువేల ? వేఁసి * ధ్యమ్ముగమ్ము
గీ॥ అనినవిని శివునకు వాఁ * డనియెనిట్లు
నధముడైనను నీమదే * రైనగాని
గురువు చెప్పుడైన విడనాడ * గూడదనఘ
పరమగురునిందకంటె పా * పంబుగలదె ?
కం॥ ఆలదువచ్చిన నేనును
అతనితో కత్తు గాని * యటు గాకున్నన్
భూతేశా ! జగదీశా !
నాతరమా ? నీతో రాగ * నయముగ జెప్పుమా !
గీ॥ అనిన భూసుర వరప్యాంతి * ననుగ్రహించి
దీనసంరక్షకుడుగ్రొన్న * దేవదుండు
నతిదయాశాలి సుకవిసం * స్తుత త్రిశూలి
వానితో నిట్టులనియెసం * బరము మెరయ
కం॥ మెచ్చితి నీగురుభక్తికి
మెచ్చితినీశాంతమునకు * మేదినినిటు చెం
తెచ్చినశిష్యుడుగలడే ?
హెచ్చుగ నికదెమ్ము వేగ * నీగురువరునిన్
కం॥ అనిపల్కిన శరకంఠుని
కనికరముగువాక్యములను * గడుముదమున గు
ర్వ్యనుపిలువగ వాఁడం డి
ట్లనువత్సా ! దత్తైరుకుల * యతివనుకూడన్
కం॥ అని మొరకులభామకడకు
జని వానితో నిట్లనును * సతి ! కైలాసం

మునకకుగుదమా ? యవనా
వనితామణిపల్కెనిట్లు * వగలాపికదుస్

కం॥ మాతలితండ్రులు బాపిన
యేతావున కైనగాని * యేవత్తునమీ
ష్మాతలసుర ! యటుగానిచొ
నేతావునకైన గాని * యేరానసుమీ

కం॥ కైలాసము గియిలాసము
లేలా ? యటునిప్పడేగ * నేలాభామా
లోలుడవై భువిమనకైన
కేళింగడునోలలాడి * కేర్తింగనుమా

కం॥ మీవారినిగొనివచ్చెద
నోవనితా ! యనుచు నేగి * నొగిమామకడన్
భావమున భయమునొందుచు
సేవకునింబోలెనిలచి * చెప్పెసుమతియై

కం॥ మామా కైలాసమునకు
మీ మానినితోడ గూడి * మీకూతురితో
నేమముగ రమ్మనిక్కచు
ప్రేమను చూపించు మిడియె * పెద్దవు గనుకన్

కం॥ అవ నాశడు నల్లునిపై
గినిసి యిట్లు లనును నీకు * కేలేయిటుమా
వనితను పెండ్లాడియు బా
విని గొంపోవంగ జవికి * నే నొప్పనుమీ

గీ॥ ఐన నొకమాట చెప్పెద * నధిక శ్రిద్ధ
వినుము మాగూర్చి యొక్క వా * హనము తెచ్చి
యిచ్చితేని మహా ప్రీతి * వచ్చి నిన్ను
కగమః నిరతంబు సంతోష * పరతు మయ్య

కం॥ ఆ మాటల నన్నియు విని
భూమీసుర పుంగవుండు * మోదము తోడన్
మామను వెంటన్ గొని తన
ధామ కడప కోయి రాగ * ధామా యనుచున్

గీ॥ ధామ నోడను శావకో * మామ నోడ
మరదలితో నత్తనోడ కం * కడుని కడకు
జని నిలచి వందనము లిడి * వినయముగను
ఘోడ వాహనముల నీయు * డని మహేశా

గీ॥ అనిన విని శంకరుండు వా * హనము లీయ
మిగుల శంకించి యప్పుడు * మేటిసను
రువితో నిట్లనె వాహన * మెట్టు లిత్తు?
నిచ్చుటకు వీలు కాదని * హెచ్చి పలికె

గీ॥ అప్పుడు భూసుర శిష్యుండు * వాలకించి
హరుని నో నిట్టు లనియె న * న్యాత భక్తి
భర్గ! శరకంఠ! పురహర! * ఫాలనేత్ర!
పరమ పురుష! దయానిధీ! * భక్తపోష!
మమ్ము గాంపోవుమయ్య మాం * పాహి శరణు

కం॥ వందనములు గంగాపతి
వందనములు పార్వతీశ * వందనము హరా!
వందనములు పురహరణా
వందనములు నీకు భక్త * వందిత! యభవా!

కం॥ అని వినుతింపుచు ప్రార్థిం
చిన భక్తుని జూచి వాని * పరివారమునన్
గని రమ్మని పల్లకిమీ
దను గూర్చుండింగ జేసి * తద్దయు నరిగెన్

౫. కనుక (ఫలశ్రుతి

గీ॥ పరమ సుజ్ఞానియగు నొక్క * గురుని వెదకి
వివిధ గతుల నతనియొద్ద * విద్య నేర్చి
తనకు వానికి తనవారి * కిని మరింత
ఖ్యాతిఁ దెచ్చిన యతఁడుశ్రీ * ప్రవరుఁ డరయ

---

## రా మ లిం గే శ శ త క ము. వెనుకటితరువా

సీ॥ మేటి పండితుల స * మీపంబునకుఁ జని
లో తెరుంగక పెంకి * కూఁత లాడి
తత్త్వవేదులతోడ * దగుచు సంభాషించి
మతిలేక జికిబికి * మాటలాడి
యద్వైత వేత్తల * మధ్య నెట్టలో దూరి
పనికిరానివి కొన్ని * ప్రశ్న లడిగి
యిద్దరు మిత్రుల * యొద్ద ప్రవేసించి
నిముషంబు లోన వై * రము దగిల్చి
గీ॥ పెట్టి ఘనునైన మరి బుకా * యింపఁజూచు
చెప్పుదెబ్బల ముచ్చును * జేర్పరాదు ॥ అ ॥
సీ॥ ఒరుల భాగ్యముఁ జూచి * యోర్వలేకుండుట
యెంతైన నీచుల * పొందు గనుట
చుట్టపక్కాలను * చులకనఁజేయుట
జ్ఞాతి వర్గముఁజూచి * రోఁత బడుట
పర చేడియలఁగూడి * సరసోక్తు లాడుట
సాధు వర్గముపైన * సహ్య పడుట
పొగరెక్కి కవులతో * జగడంబు లాడుట
దివిజులతో పోరు * దెచ్చుకొనుట

గీ॥ యశనమిన్నల ధనముల * కాన బడుట
చెఱుట కివియన్ని దారులు * క్షమియందు ॥ అ ॥ ౮

సీ॥ వేశ్యకాంతలఁ గూడి * విహరించుటొక్కటి, పొందుగువా
రలతోడ * పొంత యొకటి, యల్పునిఁ జేరిమా * ట్లాడు
ట యొక్కటి, వెరి నాలతోడ * వేసటొకటి, మోటు
బాలురజాల * ముద్దించుటొక్కటి, క్రొత్త మానవులతో
పొత్తు దొకటి, సతితోడ దవరహ * స్యము జెప్పుటొక్క
టి, పరులతో సనసజ్ఞ * బలుకుటొకటి,

గీ॥ కూడదలకాధిపతి పెద్ద * కొడుకు కయిన
ముప్పు తప్పదు తప్పక * నెప్పుడయిన ॥ అ ॥ ౯

## స్వాగతము.

[ శ్రీయుత గన్నవరపు సూర్యనారాయణమూర్తిగారు. ]

గీ॥ ఆంధ్రనారీమణులకెల్ల • నాటపట్టు । భరతమాతకు సౌ
భాగ్య • భాగ్యసీమ । వివిధ రసమాధురికి బాల • వెల్లి
యనఁగ । నలరితివి "స్వాగతము" నీకు నాంధ్రలక్ష్మి!

గీ॥ నాటి యనసూయ లేదను • లోటుబాటు । నాంధ్ర మ
హిళా సమాజంబు • నందకుండ । వస్తుగుణ తత్త్వమునఁ
బేరు వాసిఁ గాంచి । యలరితివి స్వాగతము నీకు నాంధ్రలక్ష్మి!

గీ॥ భావమున నేమి పదశుద్ధి • చేవ నేమి । గుణమునను నేమి
నిజకీర్తి • గొప్ప నేమి । సాటిలోకంబులో నీటుఁ • గోటు
జూపి । యలరితివి "స్వాగతము" నీకు • నాంధ్రలక్ష్మి!

# శారదలేఖలు.

సౌభాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ!

ఆంధ్ర నారీలోక మొక యమూల్య సోదర రత్నమును
గోల్పోయెనని నీవు వ్రాసినమాట వాస్తవము. కీర్తిశేషులైన
శ్రీయుత కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారు అచ్చ
మాంబగారికేగాక నాంధ్రస్త్రీ లెల్లరకును నాప్తసోదరుడు.
ఆంధ్రస్త్రీల కొరకు చేసిన యుపకృతి ప్రత్యేకముగా జెప్పుటకు
సాధ్యము కానిదైన నపారమని చెప్పకతప్పదు. శ్రీ లక్ష్మణ
రావు సోదరుని సహాయ ప్రోత్సాహములచే నచ్చమాంబగారి
వ్రాసిన యబలా సచ్చరిత్ర రత్నమాలయను సద్గ్రంథ మాంధ్ర
లాంధ్ర యువతీకృతి గ్రంథములలో ప్రథమ స్థానము వహించినది
చారిత్రక గ్రంథములే ముఖ్యములైన యాంధ్ర భాషలో
మహాపురుషుల జీవితములే యరుదైయున్న యాంధ్రభాషలో
తెలుగు సీమయందే గాక వివిధ ప్రాంతములందలి సతీమణుల
సచ్చరిత్రములను క్రోడీకరించి వ్రాయు టెంత కష్టసాధ్యమైన
పని! అట్టి యనితరసాధ్యమగు సుత్తమగ్రంథమును శ్రీ లక్ష్మణ
రావు సోదరుని ఘనసాహాయ్యమువల్లనె రచియించి శ్రీ అచ్చ
మాంబగారు మనకర్పింపగలిగిరి. ఆ యొక్క గ్రంథమును జదివి
న జాలు. ఆ సోదరీసోదరులు మాతృదేశమునకు జేసిన సేవ
వేటతెల్లమగును.

అంతియే కాదు. శ్రీ లక్ష్మణరావుగారి సంపాదకత్వమున
న వెలువడిన విజ్ఞానచంద్రికా గ్రంథమాలా గ్రంథములు స్త్రీ
య జ్ఞానతిమిరము నడచుట కెంతయో తోడ్పడినవి. ఆ గ్రంథ
మాలనుండి వెలువడిన రాణీసంయుక్త, విమలాదేవి, విజయనగర

సామ్రాజ్యమాది యుత్తమ నవలలు స్త్రీలలో గ్రంథపఠనా-
భిలాషను పెంపొందించినవి. తేనెసోక నోరు తీయనగురీతి, లక్ష్మ-
ణ...శయ్యలవారు వ్రాసిన హిందూమహాయుగము మహమ్మదీ-
యము మహా యుగము మహారాష్ట్రచరిత్ర మాది యగు చారిత్ర-
గ్రంథములు దేశచరిత్రము నెట్టిదో నెరుగని మనకు చరిత్రపఠ-
నమునం దభిరుచిని గలిగించినవి. మఱియు వారి గ్రంథమాల-
యందుండి వెలువడిన ప్రకృతిశాస్త్రములు, ఆరోగ్యశాస్త్రములు,
...మహాపురుషుల జీవితములు, పంచభూతముల ప్రయోజనమును
...తేటపఱచినవి. ఆరోగ్యవిధుల నేర్పినవి. మహాత్మరహితోపదేశ-
...ములను జేసినవి. వేయేల స్త్రీల జ్ఞానాభివృద్ధికి సర్వవిధముల
...దోడ్పడినవి. వారి యాధిపత్యమున జరుపబడిన విజ్ఞానచంద్రి-
కా పరిషత్పరీక్షలు బహుమానములు స్త్రీల యజ్ఞానమును
...కాన్పుట కత్యధికముగ దోడ్పడినవి. ఏటేట తప్పకుండ జ-
రుగుచున్న యీ పోటీపరీక్షలవలన శాస్త్ర చారిత్ర సాహిత్య జ్ఞా-
నముకలిగి ఛందోవ్యాకరణములయందు కౌశలమేర్పడి వ్యాసర-
చనలందు విన్నాణముగలిగి యనేక ఆంధ్రస్త్రీలు విదుషీమణు-
లైరి. అనేకమంది నితంతువులీ పరీక్షలలో నుత్తీర్ణులై యుపా-
ధ్యాయినీ శిక్షణమునొంది యుద్యోగములు చేసి సుఖజీవనము
చేయుచున్నారు. సభాధిపతులై వారిచ్చెడు యుపన్యాసములు
...డనెడు వ్రాయు చక్కనివ్యాసములు పత్రికలలో జదివి వాని
...జ్ఞానరసము నాస్వాదించి ఆంధ్రస్త్రీలెల్లరు విజ్ఞానులైరి.

శ్రీ లక్ష్మణ రావుగారు స్త్రీలకు చేసిన విద్యాదానము
...ప్రదానము ప్రత్యేకముగా స్త్రీలకొఱకు వా రెట్టిసంస్థ నే-
ర్పఱచకపోయినను విజ్ఞానచంద్రికా గ్రంథమండలిద్వారా వారు

వ్రాసిన వ్రాయించిన గ్రంథములవలనను జూపిన పరీక్షలవ
లనను పురుషులకన్న స్త్రీలే యెక్కువ లాభమునందిరి. దీనికి
కారణము లేకపోలేదు. ఏలనన పురుషు లనేకులు యింగ్లీషు
జ్ఞానముగలవారు. కాన వారిజ్ఞానాభివృద్ధికి ఆభాషే సాధన
ము. స్త్రీలకన్ననో నాంధ్రభాషకన్న మఱి సాధనము లేదు
స్త్రీలలో వేయింటి కొక్కఱుకైన నాంగ్లభాష పరిచయములే
దు. కాన తేట తెలుగున వ్రాయబడిన విజ్ఞానచంద్రికా గ్రంథ
మాలాగ్రంథములు స్త్రీల యజ్ఞానాంధకారమును బాయించుట
కే యెక్కువ తోడ్పడినవని చెప్పవలసి వచ్చినది.

కల్పలతా! ఇట్లాంధ్రస్త్రీల కపారయుపకృతి సల్పిన
లక్ష్మణరావు పంతులుగారు నలుబదాఱేడ్లమునఁ బూర్తిగ
నిండకమునుపే కీర్తిశేషులగుట ఆంధ్రస్త్రీల దురదృష్టమే గా
దా! ఆమహాపురుషుఁడు మఱి పదేండ్లు జీవించియున్న నింక
ఎన్ని చారిత్రగ్రంథములు, యెన్ని శాస్త్రగ్రంథములు వ్రాసి
యుండునోగదా. అక్కటా! అట్టి అదృష్టములేకున్న మానె
తుట్టతుదకు వారు వ్రాయుచున్న విజ్ఞాన సర్వస్వమందలి యాం
ధ్రసంపుటమైన బూర్తిగాకమున్నె మృత్యువు కబళించె. ఎంత
విషాదము! శ్రీలక్ష్మణరావుగారు బహుభాషావిదులు, మహా
మేధావి, అతిశాంతమూర్తి. అట్టి సజ్జనశేఖరుఁడు నడివయస్సు
న నస్తమించుట ఆంధ్రదేశ దురదృష్టము! ఆంధ్రభాష దుర
దృష్టము! ఆంధ్రుల దురదృష్టము! సందియములేదు.

కల్పలతా! శ్రీ లక్ష్మణరావుగారు జులై నెల 12 వ తేది
రాత్రి రెండుగంటలవేళ నాకస్మికముగ మృతులైరను దుర్వా
ర్త నాంధ్రపత్రికయందు జూడగనే నిలువున నీరయిపోతిని.

అకటా ! ఆంధ్రజననీ ! యెంత దురదృష్టవంతురాలవు. ఆంధ్ర జాతీయ కళాశాలా ప్రతిష్ఠాపకుడు కోపల్లె హనుమంతరాయ పుత్రరత్నమును గోల్పోయి నిండ రెండేడ్లయినదో లేదో మరల యిగా విజ్ఞాన మూర్తిని గోల్పోతివి. మరల తత్తుల్య పుత్రరత్న మును జయించగలదా యని విషాదముతోననుకొంటిని.

తదాది యీ మహనీయుని స్మృతిపద్యావళులు నిత్య ము చుచూటచే మనంబు మఱిమఱి యెగయుచున్నది. కాని యేమి చేయవచ్చు? విధివిధాన మట్లున్నది. 'సుకృతీ గత యుః' అను సూక్తి వ్యర్థమగునా?

ఇట్లు
చింతాస్వాంత
శారద

---

## మహిళా సౌభాగ్య వర్ధనీ సమాజము.
(పోలాకి-గంజాంజిల్లా)

ద్వితీయ వార్షికోత్సవము శ్రీమతి కళ్ళేపల్లి వెంకటరమ ణమ్మగారి అధ్యక్షతను జయప్రదముగ జరుపబడెను. ముందుగా దేశరాజు రామదాసు పంతులుగారిచే వ్రాయబడిన పద్యములు సంభాన శీతాయమ్మగారు చదివి అధ్యక్షురాలి నెన్నుకొనిరి. అధ్యక్షురాలు సంఘమునకు ఆశీర్వచన మొగల పద్యములు మృ దుమధుర శైలితో జదివిరి. వెంకటరమణమ్మగారు ఆంధ్రసతీ తిలకములలో విద్యనభ్యసించుటలో మొదటివారు. వీరు కొంత కాలము కాకినాడలో హిందూసుందరీ పత్రికాధిపతులుగానుండి రి. సిమ్మలవిశాఖపట్నం బాలికాహైస్కూలులో హాస్టల్ సూప

రింటెండెంటుగ నుండిరి. ఇప్పుడు మన ఆంధ్రస్త్రీల అభివృద్ధికై ఆంధ్రలక్ష్మి యను నొక పత్రికను నెలకొల్పిరి. వీరి యుత్సవ సందర్భమున నిచ్చిన అధ్యక్షకోపన్యాసము దేశాభ్యున్నతికొరక హితోపదేశము

ఈయుత్సవమునకు కళింగపట్నము నరసన్నపేట, శ్రీకూర్మము, శ్రీకాకుళము మున్నగు తావులనుండి సంఘాభిమానులగు సతీతిలకములు విచ్చేసిరి. అందు కళింగపట్నం వాస్తవ్యురాలు శ్రీమతి మొసలికంటి కామేశ్వరమ్మగారు పతిభక్తి నిగూర్చి దేశాభిమానవృద్ధికై నిరాఘాటముగా నొక ముహూర్తకాల ముపన్యసించిరి. పిమ్మట శ్రీయుత దార్లపూడి లక్ష్మినారాయణశర్మగారు చెప్పిన మంగళహారతులు శ్రీమతి సురరాపు లక్ష్మినరసమ్మగారు అత్యద్భుతముగా పాడిరి తరువాత అధ్యక్షురాలి వుపసంహార వాక్యములతో సభ ముగింపజేసిరి. ముందు రాబోవు తృతీయ వార్షికోత్సవమున ఆయుర్వేదమున శారీరభాగమునకు వ్యాసము వ్రాసి. సతీమణులలో 1, 2 తరగతులలో పరీక్షనందిన వారలకు. పారితోషికములు నియ్యబడును.

ఈ సమాజము నీగ్రామమున స్థాపించుటకు ముఖ్యకారకులు శ్రీయుత దార్లపూడి లక్ష్మినారాయణ శర్మగారు. వీరే ఈ సంవత్సరోత్సవమున కే తెంచిన వారలకెల్ల నాతిథ్య మొసగిరి.

ఇట్లు

సు॥ అప్పలనరసయ్య,

ప్రధాన పాలకులు.



# పద్మిని.

చెరపకుమీ చెడెదవు )

పూర్వకాలమున మీవారుదేశమునకుఁ జిత్తూరునగరము రాజధానియై యుండెను. బలిష్ఠములగు ప్రాకారములును, నత్యున్నతములగు దేవాలయములును, రమ్యములగు మేడలును, మనోహరములగు పూదోటలును, శూరాగ్రేసరులగు రాజపుత్రులను గలిగి, యానగరము శత్రుదుర్భేద్యంబగురీతి నొక్క చదునుకొండపై నిర్మింపఁబడెను. ఆకొండమీద నేయున్న యొక దేవత ఆనగరమును గాపాడుచుండెనని వాడుక కలదు

పదమూడవ శతాబ్దమున మీవారుదేశమునకు లక్ష్మణసింగను నొకబాలుడు రాజగుటం జేసి, యాతని పినతండ్రియగు భీమసింగు సంరక్షకుఁడయి రాజ్యతంత్రమును నిర్వహించుచుండెను. భీమసింగు సింహళద్వీపరాజపుత్రికయు, నసమానరూపలావణ్య విరాజితయు నగు పద్మినిం బెండ్లాడెను.

అప్పటికి ఢిల్లీచక్రవర్తియు, నధమాధముఁడును, బరమదుర్మార్గుఁడును పాపియునగు నల్లాయుద్దీనతి క్రూరంబుగ దనప్రజలను బాధనము జేయుచుండెడివాఁడు. భూలోకమున పద్మినింబోలు సౌందర్యవతిలేదని యాకాలపుప్రజలు చెప్పుకొనుచుండ నాదేశమంతట నామెకీర్తి వ్యాపించి యెట్టకేలకా కాముకశిఖామణియగు మన చక్రవర్తి చెవిని బడెను. ఆయువతీరత్నము పద్మినీదేవి సౌందర్యాతిశయములు వీనులవిందుగా వినినవాఁడగుటచే మదనావేశుఁడై యామెను జేకొనఁగోరి, మహాసేనను గూర్చుకొని చిత్తూరునగరమును ముట్టడించి తన యభీష్టమును రాజునకు దెలియఁజేసెను.

ఇట్లు పండ్రెండు సంవత్సరములు ముట్టడివేసెను. కాని, రాజపుత్రులు న్యాయమగు తనకోరికను నిరాకరించుటచేతను, నగరపు రాతికోట దుర్భేద్యమగుటచేతను చక్రవర్తిపన్నుగడలన్నియు బూడిదలోఁబోసిన పన్నీరాయెను. అంతఁ జక్రవర్తి తనయాటలచ్చటఁ బనికిరావని తెలిసికొని బింకము వ పద్మిని తనకక్కరలేదనియు, నామెతాను వినినంత జగన్మోహనాకారిణియో కాదో యెరుంగవచ్చితిననియు పద్మినీదేవి రూపమొకయద్దములో

దనకుజూపిన తాను రాజపుత్రులను బాధించక తనస్వదేశమునకు మరలెద ననియు పామువాక్యంబులం జక్రవర్తికి వర్తమానమంపెను. అంతగాజపు త్రులెట్టులనో వానికోర్కె నియ్యకొనిరి.

అంతనల్లాయుద్దీను సంతోషాంతరంగుండై స్వల్పపరివారపరివృతుండై చితూరుకోటకుంజని రాచనగరుం బ్రవేశించి యచటకొక నిలువుటద్దమున పద్మినీరూప ప్రతిబింబమును గాంచి కృతార్థుండయ్యె. చక్రవర్తి తన యింటికి వచ్చినప్పుడు వానిని సాగనంపకపోవు టనుచితమని యెంచి భీమసింగు కోటవిడచి చక్రవర్తితో వాని శిబిరమునకు జనెను. చక్రవర్తిచే మన భీమసింగుగారచట కారాగారబద్ధులుగ జేయబడిరి. అంత నల్లాయుద్దీను పద్మినిని తనకు కానుకగా నిచ్చునెడ భీమసింగు విడువబడునని తన్నగరముగల రాజపుత్రుల కెరుకబరచెను.

తోడనే రాజపుత్రులెల్లరును కర్తవ్యమును నిర్ణయించుటకు కొలువు దీర్చి యుండెమిరో స్థిరపరచుకొని చక్రవర్తికి తనకోర్కె నీడేర్పంజేయు చున్నామని వర్తమానమంపిరి.

(పద్మిని ప్రాణరక్షణముకన్న మానరక్షణమే యధికముగా నెంచుకొను రాజపుత్ర స్త్రీ యయ్యు రాజబంధువులు చేసినతీర్పు నీచమని యెంచక యాపత్సమయమున మానభంగముగాకుండ గాపాడునాయుధమును వెంటనిడుకొని పోవుటకు సిద్ధమయ్యెను )

అంతట చితూరుకోటలోనుండి యేడువందలపల్లకీలు బయలుదేరెను. పల్లకికాఱుగురు బోయీలు చొప్పున సుమారు నాలుగువేలమంది బోయీలోండారధ్వనులచే దిక్కులు పిక్కటిలునటుల వానిని మోసుకొనిపోయి చక్రవర్తిశిబిరముకడ నుంచిరి. పల్లకులను వెంబడించివచ్చిన పద్మిని మేనమామయగు గోరాసింగు చక్రవర్తితో పద్మిని కడసారి తనభర్తను జూడ గోరుచున్నదని చెప్పి యాతడటులొనర్చుట కొప్పుకొనెను. అంత పద్మిని డొలీకృవచ్చినదన్న పల్లకిని భీమసింగు శిబిరములోపలికి గొంపోయి విడది

ఆ పల్లకిలోనుండి కొందఱు రాజపుత్రులు దిగి భీమసింగు బంధనములన్నియు దీసివైచి వానికై వారితో దెచ్చిన యశ్వముపై నధిరోహింపఁజేసి యెట్టులనో శత్రుమూకలనుండి తప్పించి యాతనిని జితూరునగరమును చేరునట్లుగఁ జేసిరి. అసంగతి చక్రవర్తి యెఱిఁగి వానిని బట్టుకొనుటకు విమ్వకర్తులఁబోవ ల నంపెను. కాని వాని ప్రయత్నములన్నియును నిష్ఫలములాయెను.

ఇంతలో మహాశ్చర్యకరముగ నేనువందల పల్లకిలనుండి యేడువందల శూరశిఖామణులగు రాజపుత్రవీరులు వెలువడి యాయుధపాణులై నిలచిరి. పల్లకులు మోసిన బోయలందఱును ఖడ్గపాణులై యుద్ధసన్నద్ధులైరి. చక్రవర్తి సేన యింతపాటునప్పని మఱఁగను నిర్లక్ష్యముగ నుండుటఁజేసి తురకలు భీమసింగునకు చేసిన ద్రోహమునకుఁ, పరిభవమునకుఁ దగినట్లు కసిదీర్చుకొనిరి

ఆహా! భీమసింగును వంచించి పద్మినిని చేపట్ట నెంచిన అల్లాయుద్దీను నకెట్టిపరిభవముసంఘటిల్లెనో చూచితిరికదా! « చెరపకుము; చెడెదవు » అనురీతి యిందుమూలమున స్పష్టమగుచున్నది. చక్రవర్తి భీమసింగుకన్న అన్ని విషయములందును బలవంతుడ ననుకొనియేకదా రజపుత్రుని వంచింప నెంచెను? కాని, పద్మనాభుడు ధర్మతత్పరులను రజపుత్రులను గావక పరమ పాతకుడగు నల్లాయుద్దీనునికా జయమునొసగును? జయాపజయములు దైవాధీనములను నానుడి వ్యర్థమగునా?



చ॥ కరిముఖువాహనంబుఁ దినఁ * గాఁ దన భూషణమైనసర్ప మే
త్రైఁ జను; దాని షణ్ముఖుని * తేజితవాజను; నిద్దరాండ్లపో
రిపడఁబాయు; కంటిపెగఁ * జంద్రుఁడు కందఁగఁజొచ్చు; పార్వతీ
తురగము నిప్పునాయకుని * దుండము చెండగఁజూచెఁ దా
హటుఁడు విరక్తుడై దినియె * హాలహలంబును గాని, దానిచే
మరణముగాని రాయితము * మర్త్యమునొందెను లింగరూపుడై.

—(0)—(0—(0)—

శు॥ సారణా! మన రాజుగారి బాధలకు సహించి దేవతలు మి
న్నకున్నారా?

సా॥ అబ్బో వారు మిన్నకుందురా, వెంటనే బ్రహ్మయొద్దకు ప
రుగెత్తి బాణుని బాధలకు తాళజాలకున్నామనియు రక్షిం
పుమనియు ప్రార్థించిరట. అందుపై నలువ శ్రీకృష్ణుని మ
నుమఁడగు అనిరుద్ధుని మన బాణునికూతురగు నుష యొద్ద
ప్రవేశపెట్టుమనియు, వారి సమాగమమువలన బాణునికిని
శ్రీకృష్ణునకు నువిరోధముసంభవించుననియు బాణుఁడు శిక్షిం
పబడుననియుచెప్పెనట. దేవతులాకుతంత్రమున సఫలీకృత
మనోరథులయిరి. ఇప్పుడుఅనిరుద్ధుఁడుమన ఉషాసుందరీ అం
తఃపురమున నామెతో క్రీడావినోద విహార మొనరించు
చున్నాఁడు. ఈ రహస్యమన్యులకు తెలియకుండ నంతఃపుర
దాసదాసజనులు కాపాడుచున్నారు. ఇపుడు కొంపమును
గినది. ఉషగర్భవతియైనది. ఈ సంగతి రాజుగారికి తెలిసి
నచో నామెకు ప్రమాదము. తెలుపనిచో మాకు ప్రమా
దము. ఇటుచూచిన నూయి, అటుజూచిన గోయి. అందు
నేమియుదోచక దాగటిలోని వెలంకాయవలె తల్లడిల్లు
చున్నాను. నాయదృష్టవశమున నీవగుపడితివి. ఏమిచేయు
మనియెదవో దయచేసి తెలుపుము:

శు॥ సారణా! ఈవిషయములో నీవనుచున్నటుల నేమిచేసినను
ప్రమాదమున్నది గాని, పుష్పము వికసించిన పరిమళము
దాగనుగనుక నీవు తెలుపకపోయినను రాజుగారికి తెలి
యక మానదు. ఆవెంటనే నీచావుతప్పదు. తెలిపిన నా

డల రాజుగారి ప్రాణముండువరకు నీకు ప్రాణభయము లేదు. "తలవడచే నటికొక్క. దైవము లేదే" అనుటచే చావుతప్పిన తప్పవచ్చును. గాన తత్క్షణమే రాజుగారిచెవిని వేయుటయే మంచిదని నాయూహ. ఆత్మబుద్ధి సుఖమందురుగాన నీవును బాగుగ నాలోచించుకొనుము.

సా॥ బావా! ఆలోచించుకొనుట కేమికలదు! నీవు చెప్పినదంతేయు సత్యము నేనువిన్నదియు సత్యమేయైనది. అంతఃపురమునందున్న వాడనిరుద్ధుడే కాని వేరొకడు కాడు. అతండు కృష్ణపౌత్రుండగుటచే నీ బాణాసురునకు దీసిపోవువాడు కాడు. గాని, నిరాయుధుండై వంటియుంటి కుండేలువలె నా మేనల్లుఁ జిక్కికొని యున్నాడు. గాన, బాణునిచేఁ బట్టుపడుటయు, నాసంగతి నెరింగి కృష్ణుండెత్తివచ్చుటయు బాణుని శిక్షించుటయు, నుషానిరుద్ధులపరిణయంబొనర్పుటయుఁ దప్పదు. ఇట్టిమహోత్కృష్టసమయమున మన యపరాధము లన్నియు మన్నింపఁబడుటయేగాక, బహుమానములగూడ నొసంగెదరు. ముందు మనకు ప్రాప్తించునది లాభమేకాని, నష్టమేమియు నుండబోదనుట నిర్వివాదసిద్ధాంతమే. ప్రస్తుతముమాత్రము బాణునికీ విషయము దెలుపనిచో చావుసిద్ధము కనుక, నీయుపదేశమును శిరసావహించి వెంటనే రాజుగారియొద్దకేగి జరిగినసమాచారమంతయు విన్నవించి సన్నిహితముగనున్న చావుతప్పించుకొనెదను. గనుక సెలవిమ్ము; పోయివచ్చెదను.

(అని నిష్క్రమించును.)

# ఉ షా ప రి ణ య ము.

## —చతుర్థాంకము.—

(రంగము - బాణాసురుని మహలు.)

[బాణాసురుఁడును, మంత్రియగు కుంభాండుడును మాటాలాడుకొనుచుండగా సాగణుఁడు ప్రవేసించును.]

సా: దేవా! ప్రభువతంనా! తమ యాజ్ఞానుసారము. కన్యాంతఃపురిలోని కోటముంగవునగునయినను జొరనీయక మేమతిజాగరూకతతో గాచికొని యుండఁగా నేమి మాయయో గాని, మనయుష గర్భవతియైనది. ఈవిషయమును తమ సన్నిధానమున మనవిచేయనిచో ప్రమాదమని విన్నవించుకొనినారము. తమ చిత్తానుసార మాజ్ఞ నొసంగఁ ప్రార్థించుచున్నారము.

కీర్తన.

మహారాజా! మనవినివినుమా। ఓ మహారాజా! ॥

మనయుషాచరితము మాలిన్యమాయెనుమా. ॥మహా॥

మంతనమున వేము। అంతిపురము గాచి। వింతవారల నెపుడువీక్షింపఁగా లేదయ్యా. ॥మహా॥

పోతుటీగనయిన। పోనీము లోనికి। ఏ తెరగుననో కాని। యింతి చూలాలయ్యె నయ్యా. ॥మహా॥

చెప్పకుండిన మాకు। శిక్ష చేసెదరని। విప్పిచెప్పితిమిక మా! తప్పేమియును లేదయ్యా. ॥మహా॥

బాణు॥ (రోషభీషణాకారుఁడై) సారణా! నీవు వెంటనే సేనాధ్యక్షుని యొద్దకేగి కన్యాంతఃపురంబును గాలించి వెదకి అచట దాగియున్న పురుషునిపట్టి కట్టితెమ్మని మా యాజ్ఞగాఁ జెప్పుము. వానిందెచ్చువంకు మేమిచటనే యుంచుముగాన నతిత్వరితముగఁబొమ్ము. ముహూర్తకిదియే యాజ్ఞ. [సారణుఁడు నిష్క్రమించును]

కుంభా॥ అసురాధిపా! తమపేరు విన్నమాత్రమున సమస్తసురాసురులును గడగడలాడుచుండు నీసమయమున నెవ్వఁడు మన కన్యాంతఃపురమునఁ బ్రవేశించుటకు సాహసింపఁగలఁడు? ఇదియంతయు నొక మాయవలెఁ గానవచ్చుచున్నది. ఆపురుషుఁడు నీకల్లుఁడు కాఁదగి యుండును. లేనిచో మనయుష వరించునా? మరియునతఁడసమాన బలుఁడుగానోపు. లేనిచో నింతకాలము వెరపావంతయును లేక మనకన్యాంతఃపురమున నుండసాహసించునా?

సారణు॥ [భయకంపితగాత్రుఁడై ప్రవేశించి] మహాప్రభో! కొంపమునిఁగినది. దేవరవారియాజ్ఞను దెలిసినవెంటనే సేనాధిపతి కొంతసేనతో వెడలెను. ఆతఁడంతిపురివంటియుండు నాయుధాగారముకడ కేగునంతకే సుకుమారశరీరుఁడగు నొకబాలుఁడచటి కావలివారిం జంపి పలయు నాయుధంబుల గ్రహించి సింగపుంగొదమవలె లంఘించి మనవారిపైఁ బరికి మన సేనలనెల్ల చించి చెండాడిన మనవారెల్ల దైన్యంబునొంది చెదరిగి నెరచిపరచుచున్నారు. దేవరవారకీసంగతిం దెలుప నేనటకే తెంచితిని. తమచిత్తము.

బాణు॥ కోపోద్దీపిత చేతస్కుండై భీషణకరవాలము కేలంబూని కుంభాండుండు వెంటరా కన్యాంతఃపురికేగును.

ఉష॥ నాథా! నేను మిగుల భారపాటుగావించి మీకిట్టి పోరాటము తెచ్చిపెట్టితిని. పార్వతీదేవి యాజ్ఞానుసారము మన పరిణయమైనది గాన నామెయే ముందువచ్చు నాపదలకు కాపుదలఁ గావించుననుకొంటిని. ఆమెయే నాతండ్రిని మంగళించి మనవివాహము విధ్యుక్తముగగావించుననుకొంటిని. ఆవిషయమున నామెతూష్ణీభావము వహించినది. నాతండ్రియు యుక్తాయుక్తముల నించుకేనియు నాలోచింపక కోపితుడై మిమ్ము రూపు మాపనెంచి విఫలప్రయత్నుండై దండతాడిత భుజంగంబువలె మండిపడుచు భీషణకరవాలంబు కేలం దాల్చి యిటె వచ్చుచున్నాడు. మీరును వానికి దీసిపోవువారుకారని యెరుంగుదును. గాని మా జనకునిది స్థానబలము. మీ రొంటరిగా నున్నారు. మఱియు నిపుడె ఘోర యుద్ధమొనరించి యలసియున్నారు. మీకు జయంబు సందేహాస్పదమని నాచిత్తం బుత్తలపాటునందుచున్నది. నేను తిరస్కరిణీవిద్యయు, నంతరిక్షగమనంబును నెరుంగుదును. గాన మన మొరులకంటఁ బడకుండ ద్వారకానగరంబునకుఁబోయి కార్యసాధనఁ గావించుకొనుటమేలని తోచుచున్నది.

అని॥ ప్రేయసీ! నీవాక్యములు యుక్తియుక్తములే గాని ప్రాణముల కాశించి వెన్నిచ్చి పాఱుట శూర ధర్మము కాదు.

శా॥ నాకేలన్ గరవాలమున్న వినమో * నాకేశిరోరత్న, నా!
పాకారిప్రముఖాదులైనను భయ * భ్రాంతాత్ములై నబ్ధిశల్
జీకాత్తై పఱువెత్తఁ జేసెదను శ్రీ * కృష్ణుండు నన్మెచ్చ ర
క్షోకాంతుండెనగం దికుంద నిపుడే * చూపింతు నాశౌర్యమున్

ప్రాణేశ్వరీ! నీవు లోనికేగుము. నేను నీజకుని పరాక్రమంబెట్టిదో యోచించి చూచెదను. (బాణు నెదుర్కొనును)

బా. వీడు చూచుటకు బాలుఁడుగాని యస్త్రవిద్యయందాఱి తేరిన పరాక్రమశాలివలెఁ గానవచ్చుచున్నాడు. నేను వేయి చేతులతో నంపవెల్లి గురిపించఁ దనరెండు చేతులతోడనే మాయించుచున్నాడు. అమోఘములగు నాయస్త్రశస్త్రములన్నియు వీనియెడ వ్యర్థములైనవి. దేవేంద్రాది దిక్పాలురందరితో యుద్ధములు గావించితిని. నాయెదుట నెల్లరుఁ దల్లడిల్లి పరచువారేగాని, నిలుచువారు లేరని గర్వించితిని. వీడు నన్నెదుర్కొని నన్ను నొప్పించుచున్నాడు. మనుజ బాలకునకు వెరచి పరచు నాప్రాభవ మంతయు మంటఁ గలసెనా? ఏమిచేయుదును. ఇకనున్న దొక యుపాయమే (నాగాస్త్రమును వింట సంధించి)

గీ॥ సత్యశీలుండు ననుగన్న • జనకుఁ డేని
హరుని కేనొక భక్తుండ • నగుదు నేని
యీశరం బనిరుద్ధుని • పాశగులయి
బంధితుని జేసి నన్నుఁ గా • పాడు గాత

(అని విడుచును)

అనిరుద్ధుఁడు నాగపాశములచే బంధింపఁ బడును.

---

# బ్రహ్మపుర మహిళా సమాజము.

ఈ సమాజము సుమారు పదునారు వత్సరములకు పూర్వమున స్థాపింపఁ బడినది. ఇయ్యది మొట్టమొదట గవర్నమెంటు బాలికా పాఠశాలలో జరుపఁబడుచుండెను. సమాజ సభలు సచట సక్రమముగా జరుపుకొనుటకు సంభవించుచుండు ప్రతిబంధకములను పరిశీలించి కీర్తిశేషులై గౌరవనీయులగు మ॥ రా॥ గాదె రాఘవరావుపంతులుగారి ధర్మపత్నియగు చూడికుడుతమ్మగారు సుమారు మూడువేల రూప్యములవరకు వెచ్చించి పురస్త్రీల యుపయోగార్థమై పట్టణమునకు మధ్యసీమనొక భవనము గట్టించియిచ్చి తమ సోదరీవాత్సల్యమును, స్త్రీవిద్యాభిమానమును, ధర్మకార్యాచరణశీలమును, సహజౌదార్యమును వెల్లడించిరి. ఈభవనము డాక్టరు కమలాకరుగారిచే తెరువఁబడి శుక్లపక్ష చంద్రునివలె దినదినాభ్యుదయమంది స్త్రీవిద్యాభ్యుదయకరములగు నుద్యమములఁ గావించుచు నా పతివ్రతాశిరోమణి యశంబును దశదిశల వ్యాపింపఁ జేయుచుండెను. ఇటులనల్లారుముద్దుగాఁ బెంపఁబడుచున్న సమాజబాలికా దురదృష్టవశమున చూడికుడుతమ్మగారికి పతివియోగ దుఃఖము ప్రాప్తించుటచే నామె శోకమునకు నీసమాజబాలయుఁ గృశింపఁజొచ్చినది. ఇందుతోఁబాటు దీనికంగముగా శ్రీమతి విజయలక్ష్మమ్మగారిచే నొసఁగఁబడిన పుస్తకభాండాగారమును నొకమూలఁ బడినది. గాన నో బ్రహ్మపుర పురంధ్రీ రత్నములారా! మీలో ననేకులు విద్యావతులు, త్యాగశీలురు, సోదరీజన శ్రేయోభిలాషలు, సకలోద్యమాభిమానినీయులు, లక్ష్మీపుత్రికలును గలరు. అట్టి సోదరీమణులెల్లరు సమాజబాల నిటుల నాదరింపకపోవుట నలుగురు నవ్విన్న నగుబాటుగాదా? జగ

మఱియు భారతమాత నుద్ధరింపఁ గంకణముకట్టి మీరీసమాజ
బాలనము నుద్ధరింపఁగడంగుడు. మనసమాజము ఆంధ్రదేశ
సమాజములలో మిన్నయనిపింపుడు. సద్విద్యయు, భగవద్భక్తి
యు తోటిసోదరీమణులకు నేర్పుడు. స్త్రీవిద్యాభ్యుదయకరంబు
లును, పట్టణారోగ్యప్రదంబులునగు విషయములను చర్చింపుడు

ఎవరియిండ్లలో వారు చదువుకొనఁగూడదా యందురే
మో! అట్లనుట ధర్మము కాదు. మనము సర్వజ్ఞులము కాము
గాన నొకగ్రంథము నవలోకించునపుడనేక సందియంబులు పొ
డమవచ్చును. వానిని నివారించుకొనుటయే గ్రంథపఠనాఫలిత
ము. మరియు మనజీవితముయొక్క యస్థిరత్వమునుగూర్చియు
జీవితకాలములో మన మొనరింపవలసిన పనులంగూర్చియు మన
పూర్వపు సతీతిలకము లెందువలన సంతటి మహిమాన్వితలై
వారు గతించియు వారికీర్తిని చిరస్థాయిగా నిలుపఁగలిగిరో
మొదలగువిషయముల నన్యోన్యసహాయ్యమునఁ జర్చించుకొను
చు సత్వగుణవిధానులమై యాత్మాభివృద్ధి నందవలయును.
అజ్ఞానాంధకారమునఁ బడియుండు సోదరీమణుల నుద్ధరించుట
కందర మొకచోఁగూడి ప్రయత్నించి పరార్థపరులము గావల
యునుగాని, మనయింటఁగూర్చుండి స్వార్థపరులమగుట వ్యర్థ
జీవనమని నాయభిప్రాయము గాన వారమున కొకసారయిన
సమాజభవనము నలంకరించుటకు బ్రయత్నింపుడు. మనము
సఫలీకృతప్రయత్నులమగునటుల పరమ దయావశుండగు
పరమేశ్వరుఁ డనుగ్రహించుఁ గాత!

———:o:———

# కాలచక్రము.

శ్రీయుత సాతుమహంతి ఈశ్వరప్రసాదరావుగారు

—(o)—(o)—(o)—

గీ॥ ధర్మసంస్థాపనాపర * తంత్రులయిన । పాండవేయాగ్రజాది
సం * భావ్యులెల్ల । నేల; చిరకీర్తిశాలివై * గ్రాలుచుండు
కాలచక్రమునకు నెట్టి * గతులు గలిగె.

గీ॥ వేదములుమారె, గ్రతువుల * పేరుతరలె । ధర్మములుమా
రె నియమిత * కర్మలడగె । జ్ఞానమదిజారె నజ్ఞాన * మూన
జేరె। గాలచక్రమునకు నెట్టి * గతులు గలిగె.

గీ॥ సత్యమేపోయె పాపమే * సత్యమాయె। కల్లపరిపూర్ణమా
యెదు * ష్కర్మమనిన। సత్వగుణమాయె లోకమే * సమ
సిపోయె। కాలచక్రమునకు నెట్టి * గతులు గలిగె.

గీ॥ జాతియనుమాట పేరయ్యె * నీతిగోటె। లోకనికిన్ దూరమ
య్యెను * నోసరగలుగు। ధర్మములటన్న యవితమ * దా
రిబట్టె। కాలచక్రమునకు నెట్టి * గతులు గలిగె.

గీ॥ పండితులమాట సభలోన * వన్నె తరగె
పరమశుంఠలు పూజ్యులై * వరలుచుండ్రి
న్యాయమడవిని జేరెన * న్యాయమెసగె
కాలచక్రమునకు నెట్టి * గతులు గలిగె.

# వార్తలు

నీలివార్తా పత్రిక :— కాగితములు చౌకగా లభించుచుండెనని యొక వార్తాపత్రిక నీలిరంగు కాగితములనుపయోగించుచున్నదట. అదియే కాబోలు నీలివార్తా పత్రిక.

—o—

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికా ద్వాదశ వార్షికోత్సవసభ ఈసంవత్సరము అక్టోబరు 1[illegible]. 14 తేదీలలో తునిలో జరుపబడును. ఈసభకు మ॥ రా॥ రా॥ విక్రమదేవవర్మ బహదూరువారు అధ్యక్షులు.

—o—

మైలాపూరులో నెలకొల్పబడిన స్త్రీసేవాసదనమునకు శాఖగా శిశుక్షేమరక్షక కేంద్రసభయొకటి యేర్పరుపబడినది. ఈశిశురక్షక కేంద్రసంఘము శిశుక్షేమమునరయును. సదా వారి యారోగ్యాభివృద్ధికి పాటుబడును. చెన్నపురి రాష్ట్ర గవర్నరు భార్య విల్లింగ్డన్ సతీమణిగారు ఈసెప్టెంబరు 8 తేదీనాడుదయము 7-4 గంటలకు ఈశిశురక్షకసంఘమును సందర్శించిరి. కార్యక్రమమును అచ్చోట జరుపుచుండు స్త్రీల పుత్సాహము వీరిసందర్శనముచే నినుమడించినది.

కీర్తిశేషులైన శాకమూరు లక్ష్మీదేవమ్మగారు:

వీరిటీవల గుంటూరులో స్వర్గస్థులైరి. ఈమె గుంటూరు అరండల్‌పేటలో ఒకగొప్పసత్రమును నిర్మించిరి. అప్పుడు [illegible] విద్యార్థులకు వసతిగా వాడుకొనబడుచున్నది. స్త్రీయైనను విశాలహృదయము గలవారు. ఔదార్యత్వము ప్రశంసార్హము.

సచిత్రము!! సచిత్రము!!

# నేఁడే చందాదారులుగాఁ జేరుఁడు.

ఆంధ్రమున హాస్యరసపత్రికలులేని కొఱఁతను దీర్చినదని పండితులచేతను, పత్రికలచేతను కొనియాడఁబడినది.

## నవ్వుల తోఁట.

సాంఘిక నైతిక రాజకీయవ్యవహారములను హాస్యరసమున విమర్శించుచు సచిత్రముగా ప్రతిబుధవారమును వెలువడుచున్నది. చందాప్రాప్తము. వీ. పీ. ఖర్చులుగాక సంవత్సర చందా రు 2—8—0 మాత్రమే. శాంపిలు పత్రిక ఉచితము.

వలయువారు,

నవ్వులతోఁట పత్రికాకార్యాలయము,

మచిలీపట్నం, (కృష్ణా)

—o—

## సాహితి.

నూతనసాహితీశక్తికలను వెదజల్లుమాసపత్రిక. చక్కని కథలను, సొగసయిన గీతములను, మంచిమంచికవులు, కర్తలు వ్రాయుచుందురు. సాహితీ ప్రీతిభాండారమునందును భాషా సేవకుని గృహమునందును ఉండదగిన పత్రిక. బెజవాడ శారదా భాండార ముద్రాలయమునందు వెలువడును.

వలయువారు—

సాహితీపత్రిక, బెజవాడ.

ఓం

# దివ్యౌషధము

వేలకొలది యోగ్యతా పత్రములు పొందిన

## శిలాజతురసాయనము

ప్రతివారికిని ప్రాణసమానమైనది

ఇది అతి శ్రేష్ఠమైన గోమూత్ర శిలాజతు (మొమ్మాయి)తో తయారుచేయబడును. దీనిని శిలాజతు లేహ్యమనికూడ చెప్పుదురు. జీవించియున్నంతవరకు క్షయరోగి ఆస్త్మారోగి యువక ఏరోగియైనను, ఎట్టి విరోగియైనను దీనిని సుఖసాధ్యముగ తప్పక పుచ్చుకొని తీరవలయును. పాతరోగముల బారదోలుటకే గాక, నూతనబాధ్యములు రానియ్యక కాపాడును. శరీరపుష్టి, శుక్రవృద్ధి, ఇంద్రియపటుత్వము, అధిక బలము, మంచి ఆరోగ్యము అత్యద్భుతముగ కలుగజేయును. ఇంతయేల ? జీవితాంతము గర్భస్త్రీలు బాల, వయోవృద్ధులకు సహితము అన్ని విధముల ఆరోగ్యమునకు అమృతతుల్యమై యుండును. ఇందువలననే సంవత్సరమునకు వేలకొలది డబ్బాలు ఖర్చు ప్రఖ్యాతిగాంచినది. ప్రతిదినము యోగ్యతా పత్రికలను విశేషముగ ఆర్డరును వచ్చి చేయుచున్నవి పట్టణములు. పల్లెలందునుకూడ మాకు ఏజంట్లు కావలెను. ఇంగ్లీషు కేటలాగులు కోరినవారికి ఉచితముగా పంపబడును.

శిలాజతు రసాయనము 20 తు॥ డబ్బా 1కి రు 6-0-0

శ్రేష్ఠమైన శిలాజతు బజారు హెచ్చుతగ్గు ధరలను బట్టి శిలాజతు రసాయనము డబ్బా ఖరీదుకూడను మారుచుండును.

☞ చిరునామా

ఆయుర్వేద రత్న పండిత,

**బి. శ్యామసుందరరావు బ్రదర్సు**

ఆయుర్వేదౌషధాలయము, బరంపురం, (గంజాం)

# కమల

ఇది 'గోల్డుస్మిత్' అను ఆంగ్లేయకవివర్యునిచే వ్రాయబడిన 'హెర్మిట్', అను దానిననుసరించి ముద్దులుమూటగట్టుచుండు శైలిలో రసవంతములగు గీతపద్యములతో వ్రాయబడినది. ఇందొక రాజపుత్రిక తాను ప్రేమించుకొనిన సాధుని ధనమదాంధతచే మొదట గనకున్నను మెచ్చుకొని పరిత్యజించుటయు, పిదప కొంతవడకి పశ్చాత్తాపమునొంది వాని జాడ వెదకుటకై యడవిలో నష్టకష్టములుపడి మరల ప్రేమించుటయు, జదివి తీరవలెను. వెల రు 0-2-0

# శ్రీ వరలక్ష్మీ శతకము.

ఇది లక్ష్మీభక్తుల కత్యంతతోపయుక్తముగు భక్తిరస ప్రధానములగు పద్యములచే నొప్పు నూతనశతకము. ఇందలి యుదాహరణ నిందు నీతి మత సంబంధ విషయికములగు పద్యములుకూడగలవు శైలిమృదుమధురము వెల రు0-2-0

# శ్రీ మహాలక్ష్మీ పూజపాటలు.

ఇందు శ్రీమతి కళ్ళేపల్లె వెంకటరమణమ్మగారిచే నప్పుడప్పుడు రచియింపబడి క్రమపరింపబడిన పూజపాటలు మంగళహారతులు, క్రోడీకరించి ప్రకటింపబడినవి. వెల రు 0-[illegible]-0

# ఏకాంతసేవకీర్తనలు.

ఇందు గౌరీశంకరుల కొలువు, లక్ష్మీనారాయణుల కొలువు, ప్రణయకలహములు, తిరుపతి మొదలగు పుణ్యక్షేత్రములయందు జరుగు సేవావిశేషములు సంవాదరూపముగా రచియింపబడిన కీర్తనలును ఇతర భక్తికీర్తనలును గలవు. వెల రు 0-[illegible]-0

# కాంచనమాల.

ఇదియొక చక్కని నాటకము. ఇందు ఔరంగజేబు పుత్రికయగు కాంచనమాలకును, మహారాష్ట్రవీరుడగు శివాజీకిని జరిగిన విచిత్రవివాహము, ఔరంగజేబు శివాజీలకు జరిగిన సంభాషణము, మహారాష్ట్ర మహమ్మదీయ యుద్ధము. శివాజీ చెరనుండి తప్పించుకొనుట, మొదలగునంశములు. పొత్తమును గొనవలెను జదివినగాని విడువబుద్ధి పుట్టనేరదు. వెల రు 0—8—0

మా ఆంధ్రలక్ష్మీ చందాదారులకును, పుస్తక భాండాగారములకును సగము వెలకు గ్రంథము లీయబడును.

ఆంధ్రలక్ష్మీ కార్యాలయము, బరంపురము, గంజాంజిల్లా

## ప్రకటన.

జీతముపైనగాని మంచికమీషను పద్ధతిని గాని ప్రతి జిల్లాయందును, చందాదారులను కూర్చి ఆంధ్రలక్ష్మీ మాసపత్రికకు విశేషవ్యాప్తి యొనర్పగల నమ్మకమైన యేజంట్లు కావలెను వివరములు వలయువారు వ్రాసి కనుగొనవలెను

మేనేజరు,
ఆంధ్రలక్ష్మీ కార్యస్థానము,
కోటవీధి బరంపురం. (గంజాంజిల్లా)

# ఆంధ్రలక్ష్మి

ఇది స్త్రీల యుపయోగార్థమై ప్రచురింపఁబడు మాసపత్రిక ఇందు పూర్వసాధ్వీమణుల చరిత్రములు, విద్యావతులై పేరుఁ గాంచిననవీననారీమణుల చరిత్రములు, సుబోధకములగు చిన్ననవలలు, కథలు, నాటకములు, పాటలు మొదలగు స్త్రీలకుపయుక్తములగు పెక్కు విషయములు ప్రకటింపఁబడును అయ్యవి స్త్రీవిద్యాభిమానులగు పండితులవల్లను, విదుషీమణులవల్లనున్ను వ్రాయఁబడుచుండును

చందా ధరములు

| | |
|---|---|
| పోషకులకు సంవత్సరం॥ | రు 10—0—0లు |
| సహాయులకు | 5—0—0 |
| చందాదారులకు | 2—0—0 |
| విడిపత్రిక | 0—1—0 |

ప్రకటన రేట్లు

నెలకు నిండుపుటకు రు 2-0-0 సంవత్సరమునకు 20-0-0

పంక్తి 1కి 0-2-0 ఆరుమాసములకు 11-0-0

శ్రీమతి కళ్లేపల్లి వెంకటరమణమ్మ

పత్రికాధిపురాలు. [illegible], బరంపురం (గంజాం జిల్లా)

Printed and Published By K. Sivaramiah
At the Andhra Lakshmi Press, Berhampore Ganjam (Dt)

# 19 అక్టోబరు. 23

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆది...... | | 7 | 14 | 21 | 28 |
| సోమ...... | 1 | 8 | 15 | 22 | 29 |
| మంగళ... | 2 | 9 | 16 | 23 | 30 |
| బుధ...... | 3 | 10.<br>అమావాస్య | 17 | ○<br>పౌర్ణమి | 31 |
| గురు...... | 4 | 11 | 18 | 25 | |
| శుక్రి...... | 5 | 12 | 19 | 26 | |
| శని...... | 6 | 13 | 20<br>ఏకాదశి | 27<br>అట్లతదియ | |